✳ సాధకునిలో శని బుధుడితో పాటు విశుద్ధి చక్రము మీద ప్రభావము చూపిస్తాడు.

-- మనో వాక్కాయ కర్మల మీద నియంత్రణకు కారణ మవుతాడు.

✳ శని కాల గమనాన్ని నిర్ణయిస్తాడు.

-- చంద్రుని దైనిక గమనము శని యొక్క సంవత్సర గమనానికి సమానము.

-- సూర్యుని యొక్క నిత్య గమనము శని యొక్క నెలసరి గమనానికి సమానము.

అంటే సూర్యుని మాసములో ఒక రోజు, శని చేతనత్వములో ఒక నెలకి, చంద్ర చేతనత్వతలంలో 1/12వ వంతుకి సమానం.

ఇక్కడ మనుషుల పునర్జన్మ చక్రీయక్రమ రహస్యము చెప్పబడినది.

**ఎందువల్లననగా**

✳ చంద్రుడు జీవాత్మలను పృథ్వి మీదకు తెస్తాడు.

-- శని వాటిని మృత్యువు ద్వారా తీసుకొనిపోతాడు.

-- సూర్యుడు జీవింపజేస్తాడు.

విశిష్ట గణనము ద్వారా అనేక పూర్వ జన్మలను గురించి లెక్కించవచ్చు.

✳ నాడి మండలము మీద శనిగ్రహ ప్రభావము ఉన్నది.

✳ త్రిభుజాకారంలో సమాన దూరంలో పెట్టిన 3 నల్లని చుక్కల మీద ధ్యానం,

-- 'శమ్' అనే మంత్రధ్యానము శని దుష్ఫలితాలను తీసేస్తుంది.

-- శమీ వృక్షపు ఆకులు, వేళ్ళు శని స్పందనను సాధకునికి అనుకూలముగా మారుస్తాయి.

## 8. వరుణుడు (URANUS) ♅

✣ ఈ మధ్యకాలంలోనే ఈ గ్రహప్రభావం మానవజాతి సమూహముల మీద కనిపించుచున్నది.

ఒక SENSE ORGAN DEVELOP అయితే PLANETORY KINGDOM లో దాని COUNTERPART గుర్తింపబడుతుంది.

✣ URANUS రేడియో ధార్మికతను నియంత్రణ చేస్తుంది.

-- RADIUM ని గుర్తించుట ఖనిజ - మానవ జాతుల్లో URANUS ప్రభావం మొదలైనదని తెలుపుతోంది.

✣ ఈ గ్రహము SPASS CONSCIOUSNESS ని పరిపాలిస్తుంది.

అంతరిక్ష విజ్ఞానము, అద్వైత దర్శనము ఈ గ్రహ అనుగ్రహము వల్ల సంభవము.

✣ ప్రకృతిలోని శక్తులను COSMIC PLANE ద్వారా శబ్దము వల్ల నియం

త్రణ చేయుట ఈ గ్రహ ప్రభావము వల్ల మనిషి నేర్చుకుంటాడు.

- Master C.V.V. ఈ శతాబ్దపు మొదటి లో ఈ మార్గమున CANOPUS అనే నక్షత్ర ప్రభావం వల్ల దీక్ష ఇవ్వబడ్డాడు.
  -- అగస్త్య ఋషి ఈ యోగము మీద అధికారము కలిగి ఉన్నాడు.
- వైజ్ఞానికులు ఈ గ్రహ ప్రభావము వల్ల మిత్రా అనే, వరుణ అనే COSMIC కిరణములను గుర్తించగలుగుతారు.
- ఈ గ్రహప్రభావము వలన SEX లో అనియంత్రణ, వివాహాల్లో సాంప్రదాయకత లోపించటము, నీతిలేని క్రొత్త ధర్మములు జన్మించి, నశించిపోవుట క్రింది స్థాయిలో జరుగుతుంది.
- ఆధ్యాత్మిక స్థాయిలో క్రొత్త ధర్మముల స్థాపన జరిగి అతి ఉచ్ఛ సాధన చేసే సముదాయాలు ఏర్పడతాయి.

## 9. ఇంద్రుడు (NEPTUNE) ♆

- మన PLANETORY LOGOS కు శుక్రుడు ఆత్మ అయినట్టే,
  -- మన SOLAR LOGOS కు ఆత్మ ఇంద్రుడు.
- ఇంద్రుని యొక్క HIGHER COUNTERPART వేన అనే గంధర్వుడు.
- నిజానికి ఇంద్రుడు గ్రహము కాదు.
  -- ఐదు సౌరమండలాలను GROUP CONTACT లో ఉంచే HIERARCHY కేంద్రము అది.
  -- ఆ గ్రూపుకు చెందినదే మన సౌర కుటుంబము కూడా.
- ఇంద్రుడు చెందే HIERARCHY ని MUSICAL HIERARCHY గా చెప్ప వచ్చును.
  -- SUPRA COSMIC PLANE లో శబ్ద తరంగాల వ్యవస్థని ఇంద్రుడు నియంత్రణ చేస్తాడు.
  -- నారదుడు, వేన, ఇంద్రుడు ఈ HIERARCHY కి చెందినవారే.
- మన సౌరమండలంలో శబ్ద తరంగాలను సంగీతపరంగా అమర్చుట ఈ గ్రహము బృహస్పతి - శుక్రగ్రహముల ద్వారా ఇప్పటి వరకు చేసినది.
- 24 మంది సిద్ధులు మన సౌర మండలంలో ప్రవేశించిన తరవాత ఈ గ్రహం బహిర్గతమైనది (EXTERNALIZED).
- శుక్ర గ్రహవాసులు ఈ గ్రహమును ముందు గుర్తించారు. దానికి కారణం వారు COSMIC GROUP CONTACT యోగములో ముందు నుంచి TRAINING అగుటయే.

ఆ తరువాత బృహస్పతి ఈ GROUP CONTACT ని పొందాడు. ఆ తరువాత కుజుడు తప్ప అన్ని గ్రహాలు శిక్షణ పొందాయి. పృథ్వి తరువాతనే కుజుడు ఈ జ్ఞానాన్ని పొందాడు.

ఈ విధానము వల్ల ఉపగ్రహాలు ఏర్పడుట, వాటిని కొన్ని విశిష్ఠ కిరణాలను ఉపయోగించుటకు జరుగుతుంది.

✧ పృథ్వి మీద అతి కొద్ది మంది ఈ గ్రహ కిరణములకు స్పందించగలరు.

✧ శుక్రగ్రహము ఈ దీక్ష పొందినప్పుడే పృథ్వి మీద దీనిని బుద్ధుడు సనత్కుమారుని సహాయంతో పట్టుకోగలిగాడు.

✧ కృష్ణభగవానుడు ఈ ఇంద్ర కిరణము మీద పరిపూర్ణ నియంత్రణ కలిగి అవతరించాడు.

-- శరీరము వదిలే ముందు కృష్ణుడు మైత్రేయ ఋషికి NEPTUNIAN LINK ఏర్పరిచాడు.

**చాలా మందికి తెలియని రహస్యమేమిటంటే,**

☝ ఏడవ తలం నుంచి ఒక PRINCIPLE గా అవతరించిన శ్రీకృష్ణ భగవానుడు <u>ఇంకా వెనక్కి తిరిగి వెళ్ళిపోలేదు.</u>

✧ కృష్ణుడు నుంచి నేర్చుకున్న ఈ యోగమును మైత్రేయుడు భాగవతము పేర విదురునకు చెప్పెను.

-- అందుచేత నిజానికి బుద్ధుడు ఈ యోగము పొందిన రెండవ వ్యక్తి.

✧ ఈ గ్రహ ప్రభావము వలన సంగీతము ఆహారముగాను, రోగ నివారణ శక్తిగాను రూపొందుతుంది.

-- దీని ప్రభావం వలన నిద్రలో సాధకుడు జ్ఞానాన్ని పొందగలుగుతాడు.

✧ 21 వ సంవత్సరము తరవాత సాధకునకు బరువైన ఆహారము అవసరం ఉండదు.

-- త్వరలో నీరు, పాలు, స్వల్ప పరిమాణ ఆహారంతో జీవించగలుగుతాడు.

✧ GROUP CONTACT ఈ గ్రహ ప్రభావము తెలుపుతుంది.

ఈ గ్రహప్రభావం వలన వృక్ష, జంతు వికాసక్రమం మీద సంగీత ప్రభావమును గుర్తించుటయే గాక దానిని ఉపయోగించుకొనుట విశ్వమంతా వ్యాపిస్తుంది.

✧ URANUS (వరుణుడు) సామాజిక, స్థూల, అన్నమయ శరీరాల (స్థూల గ్రహములు కూడ) విస్తృత సమూహాల మీద ప్రభావాన్ని చూపిస్తే,

-- NEPTUNE (ఇంద్రుడు) సామూహిక Sub-Conscious, E.S.P., తంత్ర విద్యల మీద తన ప్రభావాన్ని, గుత్తాధికారాన్ని చూపిస్తాడు.

☝ మత్తుమందుల ప్రభావము, ఆల్కాహాలును ఉపయోగించుట, SPIRIT MEDIUMSHIP, PSYCHIC ABNORMALITIES "SPIRITUAL CRIMES" వల్ల "గురువుల శాపము" అని గుర్తించవచ్చును.

## 10. రాహు కేతువులు ☊ ☋

- ఇవి చంద్ర, పృథ్వీ గ్రహ పథములు INTERSECT అయ్యే 2 సెంటర్లు.
-- ఈ కేంద్రాలలో పృథ్వి, సూర్య, చంద్ర గ్రహముల త్రయీవిధ అయస్కాంత శక్తులు కేంద్రీకృతమవుతాయి.

అందుచేత ఈ కేంద్రంతో సంబంధమున్న ఏ గ్రహమయినా పృథ్విని ఒక విశిష్ట విధంగా ప్రభావితము చేస్తుంది.

- రాహు సంబంధము చాలా ధనాత్మకమైనది, మంగళకరమైనది.
-- కేతువుతో సంబంధం ఋణాత్మకమైనది, దుష్ట ప్రభావాన్ని చూపిస్తుంది.
- ఆధ్యాత్మిక జగత్తులో వీటితో సంబంధమున్న ఏ గ్రహమైనా సాధకుడు తన స్థాయిని చాలా ఎక్కువగా పెంచుకొనుటకు, కాలచక్రగతిని విపరీత దిశలో త్రిప్పుటకు ఉపయోగపడుతుంది.

ఈ గ్రహములను ముఖ్యముగా సాధకుడు గుర్తుంచుకొనవలయును.

- సూర్యునితో రాహువు CONJUCTION, సహస్రారంలో స్పందనలు కలుగజేస్తాయి.
-- కేతువుతో సంబంధము మూలాధారాన్ని ప్రభావితం చేస్తాయి.
- చంద్ర, రాహువుల సంబంధము PENIAL GLAND మీద ప్రభావాన్ని చూపిస్తుంది.

చంద్ర కేతువుల సంబంధం SPLEEN CENTRE మీద ప్రభావాన్ని చూపిస్తుంది.

- తన తోక మీద నిటారుగా నిలుచున్న పాము మీద ధ్యానము వీటి చెడు ప్రభావాన్ని తీసివేస్తుంది.
- కుడి నుండి ఎడమవైపుకు వ్రాసే అన్ని భాషలను ఈ రెండు గ్రహాలు ప్రభావితం చేస్తాయి.



## జ్యోతిశ్శాస్త్రము- సాధకుడు

జ్యోతిశ్శాస్త్ర ప్రకారము సాధకులను 4 విధములుగా విభజింపవచ్చును.

① వ్యక్తిగత తలంలో ద్వాదశరాశి చక్రం లో ఉన్న గ్రహాలు అవి ఉన్న స్థానము నుండి వానిని ప్రభావితం చేస్తాయి.

② వ్యక్తిత్వ వికాసంతో పాటు రాశి చక్రము లోని "HOUSES" సాధకునికి ఉండవు. కేవలము గ్రహాలు, 12 SIGNS మాత్రమే పనిచేస్తూ ఉంటాయి.

③ లగ్నము అతని చేతనత్వాన్ని పూర్తిగా ప్రభావితం చేయడం మొదలు పెడుతుంది. అతని ఆత్మ యొక్క భవిష్య ప్రణాళికను తెలుపుతుంది. రాశి చక్రం గణన REVERSE అవుతుంది.

④ లగ్నము, చంద్రుడు, సూర్యుడు 3 శక్తి కేంద్రాలుగా పనిచేయడం మొదలు పెడతారు. గ్రహాలు కాక గ్రహతత్వాలు ప్రభావితం చేయడం మొదలెడతాయి.



## మూడు గొప్ప కేంద్రములు

⌖ గ్రహములు వేరు, గ్రహ తత్వములు వేరు.

-- గ్రహతత్వాల వలన భౌతిక జగత్తులో వాటి ప్రభావము చూపించవలసి వచ్చినప్పుడు గ్రహములు ఏర్పడతాయి.

⌖ సాధకుని శరీరంలో బాహ్య జగత్తులో ఉన్నట్లే సూర్య, చంద్ర, పృథ్వీ తత్వాలు ఉంటాయి. అవియే,

ఆత్మ, మనస్సు, స్థూల శరీరము.



# ఆధ్యాత్మికతలో చంద్రుని స్థానము

- ❀ చాలా మంది ఆధ్యాత్మిక శాస్త్రవేత్తలు చంద్రుడు ఒక "DEAD PLANET" అని, పృథ్వీ పరిణామక్రమంలో దాని పాత్ర పూర్తి అయిపోయినదని వివరిస్తారు.
- ☝ కానీ అది నిజము కాదు.
- -- ప్రస్తుతం చంద్రుడు ప్రస్తుతానికి ఇంకా గ్రహరూపం దాల్చని ఒక గ్రహతత్వపు ప్రభావముల కిరణాలకు REFLECTOR గా పనిచేస్తున్నాడు.
- ❀ హిమాలయాలలో ఉండే యోగులు, ధ్రువకేంద్రము వద్ద నివసిస్తున్న కొంత మంది దివ్య మానవ సమూహాలు, ఇతర పృథ్వీగోళం మీద ఎన్నుకోబడ్డ నాలుగు తలాలలో ఉన్న వారికే భూమి మీద చంద్రుని పూర్ణ ప్రభావాన్ని తెలుపగలరు.
- ❀ చంద్రుని గ్రహతత్వాన్ని "సోమ" అని అందురు.
- ❀ పృథ్వి మీద చంద్ర కిరణాలు ఖనిజ, వృక్ష, జంతు సమూహాలలో అయస్కాంత శక్తిని పెంపొందిస్తాయి.
- ☝ అసలు కనిపించని తలాల నుండి పృథ్వీగ్రహ అవతరణ చంద్రుని అయస్కాంత ప్రభావమే.
- ❀ చంద్రుని కిరణాలు పృథ్వి యొక్క మనోకోశ నిర్మాణాన్ని గావిస్తాయి.
- -- పృథ్వి యొక్క మనోకోశానికి 16 కళలు ఉన్నాయి.
- ❀ చంద్రుని కళలే పై స్థాయిలలో మన్వంతరాలుగా, కల్పాలుగా, మహా కల్పాలుగా తెలుసుకొనబడుతుంది.



# ద్వాదశ రాశులు

## 1. మేషము (ARIES) ♈

- పరమాణు విస్ఫోటన, విడుదలైన ఆ మహత్తర శక్తిని విభిన్న అవసరాలకు వాడుకొనుట ఈ రాశి ప్రభావము.
- ఈ రాశి స్థానము మానవుని శిరస్సు.
- ఇది సూర్యుని ఉచ్ఛరాశి.
  అనగా దీక్ష యిచ్చే రాశి కూడ ఇదే.
- -- సహస్రార చక్రాన్ని సూచిస్తుంది.

"పురుషుడు సహస్రారమును తన శిరస్సుగా కల్గియున్నాడు".

కాలచక్ర గమనము యొక్క దేవత ప్రజాపతి. అందుకే సంవత్సర అధిపతిని "దక్ష ప్రజాపతి" అంటారు. ఒక యజ్ఞములో అతని తలను తీసి గొర్రె తలను అమరుస్తారు.

- అనగా సాధకుని HEAD CENTRE లో చేతనత్వాన్ని తీసికొని రావటము వల్ల అతనిలో మానవ చేతనత్వము వధింపబడి దైవీ చేతనత్వము వికసించటము మొదలవుతుంది.
- శిరస్సు మనస్సుకే కాక బుద్ధి యొక్క స్థానము కూడ అదే.
- -- అందు వలన ఆధ్యాత్మిక మార్గములో మేషరాశి అధిపతి బుధుడు.
- శిరస్సులో PENIAL GLAND, PITUITARY BODY ఉన్నాయి.
- -- ఇవి బాహ్యజగత్తులోని శంభాలా గ్రామానికి ప్రాతినిధ్యం వహిస్తాయి.
- -- ఈ 2 కేంద్రముల కలయికే ఇంద్రుని జన్మను చూపిస్తాయి (ఇంద్రయోని).
- HIERARCHY తన శిష్యులకు ఈ కేంద్రము ద్వారా సమూహాలుగా శిక్షణ ఇచ్చినప్పుడు ఈ రాశి యొక్క అధిపతి వరుణుడు (URANUS).
- ఈ రాశి సంఖ్య 9.
- -- ఆధ్యాత్మిక సాధకునకు ఈ సంఖ్య ధ్యానమునకు ఉపయోగపడుతుంది.
- ✧ సంఖ్య POTENCY ని, రంగు VIBRATION ని, ఆకృతి EXPRESSION ని తెలుపుతుంది. ఇవి మానవుని అంతః ప్రకృతి శక్తులుగా ఉంటాయి.
- ఈ రాశి రంగు ఎరుపు.
  నెత్తురు దాని జీవకణము (TISSUE).

⌖ కనుబొమ్మలు, ముక్కు, ARIES యొక్క సంకేతకముగా ధ్యానము చెయ్యాలి.

-- ఇది బ్రహ్మదండానికి, నిటారుగా ఉండే వెన్నుపూసకి, కొమ్ములు ఇడ, పింగళ నాడులకు సంకేతాలు.

-- పరిణతి చెందని మానవునిలో ఈ సంకేతము పాము యొక్క నాలిక.

-- ఆధ్యాత్మిక అభివృద్ధి సాధించిన సాధకునిలో ఇవి గరుడుని రెక్కలు.

ఇదే గరుడుడు పాములను చంపి తిని అమృతమును గొనివచ్చే కథకు అంతరార్థము.

⌖ మేష, వృషభ, మిధున రాశులు సాధకుని శ్వాస, మనస్సు, బుద్ధి నియామకం వలన అతని ప్రాణమయకోశాన్ని పునర్నిర్మిస్తాయి.

⌖ సోహం మంత్రధ్యానం విశుద్ధి, ఆజ్ఞ, సహస్రార చక్రాలలో ప్రజ్ఞతో పంపిణీ చేయబడితే ప్రాణమయకోశ నిర్మాణం శ్వాస ద్వారా జరుగుతుంది.

⌖ మేషము మూడు అగ్ని తత్వరాశులలో మొదటిది.

-- ఈ మూడింటిని త్రేతాగ్నులుగా పిలుస్తారు. వీటిని విద్యుత్, జ్యోతి, పావక అని కూడ పిలుస్తారు.

## 2. వృషభము (TAURUS) ♉

✧ ఇది మొదటి స్థిరరాశి.

-- భూతత్వ త్రిపుటిలో ఉన్నది కనుక పదార్థముల ఆకృతుల గురించి తెలుపుతుంది.

✧ భగవంతుని వాక్కు పృథ్వికి ఈ రాశి ద్వారానే వస్తుంది. దీనినే వాక్కు యొక్క నాల్గవ స్థితి అంటారు.

ఏతావానస్య మహిమా అతో జ్యాయాగ్ంశ్చ పూరుషః।
పాదో ఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి॥

పురుషసూక్తము

పైన చెప్పబడినదంతయు పురుషుని యొక్క మహిమము. ఆ మహిమ కన్నను పురుషుడు గొప్పవాడు. ఎందులకనగా ఈ మహిమ యంతయు వానిలో నాల్గవ భాగము మాత్రమే. మిగిలిన మూడు భాగములు శాశ్వతములై దేవ లోకమునందు ఉన్నవి.

ఆకృతుల వెనకాతల దాగి యున్నది సౌందర్యము. ఆకృతుల ద్వారా తప్ప ప్రకృతిలో సౌందర్యాన్ని చూడలేము.

✧ సౌందర్యము భగవంతుని అంశ.

-- కళలలో సౌందర్యాన్ని చూడగల్గుట అనే పవిత్ర ధ్యేయమును ఈ రాశి పరిపాలిస్తుంది. శ్రీకృష్ణుని లగ్నము వృషభమగుటకు ఇదే కారణము.

✧ ఈ రాశి రంగు నీలము.

-- ఆజ్ఞాచక్ర సాధన చేస్తున్నప్పుడు సాధకునకు గురువు ఇచ్చే అతి శక్తివంతమైన తాళపు చెవి ఇది.

✧ సూర్యోదయము తరవాత ఉండే ఆకాశపు నీలివర్ణమును విశుద్ధి చక్రము, ఆజ్ఞా చక్రము మధ్య నివసించే సాధకులు ధ్యానించాలి.

✧ మిధునము నుండి వృషభమునకు సాధకుని ప్రయాణము మనస్సు - బుద్ధి మధ్య సంబంధం ఏర్పరుస్తుంది.

-- అంటే స్వరములోని VOCAL CARDల ప్రయోజనము పూర్తి అగుట - ప్రాణములో స్వరము యొక్క ఉద్దేశ్యము పూర్తి అగుట.

-- ఈ "BRIDGE" GOLDEN YELLOW రంగుతో మొదలై, నీలిరంగుతో అంతమవుతుంది. ఇది మూడవకన్నుని ఉత్తేజపరుస్తుంది.

✧ విశుద్ధి చక్రము ఇంద్రుని జన్మస్థానము మధ్య 7 ముఖ్య కేంద్రాలుంటాయి.

-- వాటి ప్రతిబింబ స్వరూపాలే వెన్నెముకలోని 7 చక్రములు.

-- ఇవే కాక మెడపైన ఏడు కేంద్రాలు ఉంటాయి. వీటి సంబంధము సప్త కృత్తికలతో ఉంటుంది. (PLEIADES).

✧ వీటి మధ్య సంబంధము, అంటే శిష్యుని కేంద్రాలకు నక్షత్ర సమూహాలతో సంబంధమేర్పడుట శంభాలలో ఉన్న 7 గురువుల ఆశ్రమముల ద్వారా జరుగుతుంది.

-- అప్పుడు సాధకుని మస్తిష్కము పరిధిలో ఉన్న GLANDS ఆధ్యాత్మిక ఆహారాన్ని అందిస్తాయి.

**పాత్రత పెంచుకునే కొద్దీ ఈ సంఘటన తొందరగా జరుగుతుంది.**

అందుకనే సప్తమాతృకలను కుమారస్వామి యొక్క తల్లులుగా గుర్తిస్తారు.

✧ సాధకుడు ఆధ్యాత్మిక జన్మను పొంది కుమారుడు అవుతాడు.

సప్తమాతృకలను సప్తఋషుల భార్యలుగా కూడ పిలుస్తారు. (సప్త మాతృకలు - అంబా, దుల, నితాతిని, అభ్రాయంతి, మాఘయంతి, వర్షయంతి, చుపునిక - S.D. II P.P. 551).

☝ ఈ LINK మనోమయ తలము నుండి జరుగుతుంది కనుక గురువు లేకుండా సాధకుడు నిస్సహాయుడు.

-- సద్గుణ సంపత్తిని అలవరచుకుంటూ, పాత్రతని పెంచుకుంటూ, తన అహంకారాన్ని పూర్తిగా గురువుకి సమర్పణ చేసిన వానికే ఈ యోగం లభిస్తుంది.

✧ ఈ మార్పు GOLDEN YELLOW నుంచి ఆకాశ నీలి వర్ణము వరకు మిధునము యొక్క ఆకుపచ్చ రంగు ద్వారా వెళ్ళవచ్చును.

-- ఈ రంగుల కలయిక లోని అనేక స్థాయిలు నెమలి కంఠం మీద ఉండే రంగులు, నెమలి ఈకల మీద ఉండే రంగుల ద్వారా కనిపిస్తాయి.

✧ కుమారస్వామి వాహనము నెమలి.

-- వృషభము నెమలి, ఆవు, ఎద్దులను పరిపాలిస్తుంది.

శ్రీకృష్ణుడు ఆవులు, ఎద్దుల మందలో నెమలి పింఛము పెట్టుకొని ఉంటాడుకదా!

✧ మిధునము స్వరపేటికను పరిపాలిస్తే,

-- వృషభం స్వరమును పరిపాలిస్తుంది.

ఆలోచన స్థాయిలో ఉన్న నాద బీజం (SOUND) శబ్దము వలె (WORD) బహిర్గత మౌతుంది. అందుకే వేదాలలో దీనిని వృషభ అన్నారు.

✧ వృషభములోని సూర్యుడు - ఎద్దు (THE WORD),

-- వృషభములోని చంద్రుడు - ఆవు (భాష - LANGUAGE).

✧ WORD రెండు రకాలుగా బహిర్గత మవుతుంది.

1. CONCEPT,

2. LANGUAGE.

వీటి కలయికే సృష్టి WISDOM.

✧ అందుకే వృషభంలో బుధుడిని (MERCURY) గోవత్సముగా చూపిస్తారు.

✧ ఆకాశంలోని శబ్దము ప్రయాణించుట (చెప్పే వాడి నుంచి వినే వాని వరకు) సరస్వతి అని చెప్పబడుచున్నది.

-- దీని వాహనమే హంస. (కర్కాటకరాశిలోని "హం" - "సా" ఉచ్ఛ్వాస, నిశ్వాసలు).

✧ ఈ విధముగా ఉచ్చారణ చేసేవాడు సృష్టికర్త - బ్రహ్మ, సరస్వతి తండ్రి.

-- ఇతను CONCEPT గా ఆమె స్వరము లోను, భాషలోను కలసి ఉంటాడు కనుక తండ్రీ కూతుళ్ళు భార్యాభర్తలు అయ్యారు.

ఇటువంటి ఎన్నో రహస్యాలు విశుద్ధి, ఆజ్ఞా చక్రాల మధ్యన ఉన్న సాధకునికి తెలుస్తాయి.

✧ ఈ రాశి యొక్క NUMERICAL POTENCY - 6.

✧ గ్రహస్థాయిలో ఈ రాశికి అధిపతి శుక్రుడు.

-- వ్యక్తిగత స్థాయిలో ఈ రాశికి అధిపతి కుజుడు.

-- వ్యక్తిత్వ స్థాయిలో అధిపతి బుధుడు.
-- ఆత్మ స్థాయిలో చంద్రుడు అధిపతి.
-- బ్రహ్మాండ స్థాయిలో సోమ అధిపతి. కొంత మంది ఈ స్థాయిలో VULCAN అధిపతి అంటారు.

✧ అన్నము, రుచి ఈ రాశి ద్వారా పరి పాలింపబడతాయి. రుచి నాలిక ద్వారా బహిర్గతమయ్యే సౌందర్యము.
-- అందువల్ల ఈ రాశి ద్వారా సాధన చేసే వారికి అన్నము యొక్క QUALITY, QUANTITY రెండూ ప్రముఖ ప్రభా వాన్ని చూపెడతాయి.

✧ విశుద్ధ చక్రము ఆజ్ఞా చక్రమునకు మధ్య చేతనత్వము ఉండే సాధకులకు శబ్దమే ఆహారము.
-- ఇది ఒక - విచిత్ర స్థితి.

## 3. మిధునము (GEMINI) ♊

✽ ఇది ద్విస్వభావ వాయు తత్వపురాశి.

✽ భౌతిక శరీరంలో స్వరపేటికను, Bronchus, భుజాలను పరిపాలించును.
-- ప్రాణమయకోశంలో (Vital Body) ఇది స్పందనను నియంత్రణ చేస్తుంది.
-- మనోమయకోశములో ఈ రాశి మనిషి యొక్క Lateral sense - నిలువుగా 2 సమభాగాలగుట - (జరాసంధ).

✽ మీనరాశితో (ఇంకొక ద్విస్వభావరాశి) పోలిస్తే - మీనము మత్స్య యుగ్మము, మిధునము మానవ యుగ్మము.
-- మిధునములోని జంట ధృవత్వము కలుగజేస్తుంది (Contrast).
-- మీనము పోల్చే శక్తిని (Compare) కలుగజేస్తుంది.

✽ ఒక దృష్టికోణంలో బుధుడు నారదుడికి సంకేతము.
-- అన్నమయ, ప్రాణమయ స్పందనలతో ముక్తి చెందిన మనస్సు బుద్ధితలానికి చేరుకుంటుంది. అప్పుడు నారదుడు గురువుగా హరినామాన్ని ఇస్తాడు. (వాల్మీకి - రామాయణము, వ్యాసుడు - భాగవతము).

✽ దీని సంకేతము ♊.
-- అంటే శాశ్వత సనాతన విజ్ఞానము (ప్రజ్ఞ) మానవ శరీరము FRAME లోనే సంఖ్య, ఆకృతి, శబ్దము, రంగు నిష్పత్తి రూపములో విశుద్ధి చక్రము (స్వరపేటిక) దాటగానే తెలుస్తుంది. ∏ అర్థము తెలుసుకొనండి.

✽ వాయుతత్వము రెండు స్తంభముల (VOCAL CARDS) గుండా లోపలికి, బయటకి వెళ్ళుటను గమనించుట (సో-హం సాధన) ఈ రాశి సాధన.

✱ వాయువు ఇక్కడ గురువై బ్రహ్మ స్వరూపముగా (జీవితము),

-- వృషభరాశిలో విష్ణువుగా (ఆకృతిలో సౌందర్యము),

-- మహేశ్వరునిగా మేషంలో (సహస్రార చక్ర దీక్ష) దీక్ష ఇస్తాడు.

✱ ఊపిరిగా మిధునములో శబ్దము ఉంటుంది.

-- వృషభములో శబ్దము స్వరముగా మారుతుంది.

-- మేషములో శబ్దము ఉచ్చారణగా మారుతుంది.

✱ మిధునపు రంగు ఆకుపచ్చ.
వృషభపు రంగు నీలము.

-- అందువల్ల ఏ ఆకుపచ్చ నీలములోకి మారుతుందో, అది మిధునం యొక్క నిజమైన రంగు (కాపర్ సల్ఫేట్ రంగు).

✱ మిధునము నుంచి కర్కాటక రాశికి ప్రయాణము పునర్జన్మ ప్రయాణము (పితృయాణము).

☝ కర్కాటకరాశి రంగు వృక్షములలో కనిపించే ముదురు ఆకుపచ్చ.

-- ఈ రంగును విశుద్ధ చక్రము దగ్గర ఉపయోగించకూడదు.

✱ <u>మిధున రాశి ఆకుపచ్చ రంగు బ్రహ్మాండమైన రోగనివారణ శక్తి కలది.</u>

✱ మిధునపు సంకేతం ( ♊ ) THOUGHT FORM కూడ ఆరోగ్యాన్ని ఇస్తుంది.

✱ దీని సంఖ్య 5. ఐదు సంఖ్య యొక్క స్పందనలను భౌతిక వ్యక్తి అభిప్రాయ భేదానికి ఉపయోగించుకుంటే, బుద్ధి తలములో ఉన్న సాధకుడు విరుద్ధ ధృవాలలో ఉన్న ఏకత్వాన్ని గ్రహిస్తాడు.

## 4. కర్కాటకము (CANCER) ♋

✣ రెండవ చరరాశి.
మొదటి జలతత్వపురాశి.

✣ అగ్ని సక్రియత తగ్గి, నీటి క్రియాశీలత వాయువు ద్వారా ఈ రాశిలో మొదలవుతుంది. ద్వంద్వ స్వభావము గల మిధునరాశిలో హైడ్రోజన్, ఆక్సిజన్ వాయురూపంలో ఉంటాయి.

-- దక్షిణాయన ఆరంభంలో (JUNE 21) స్థితిలోని ఈ మార్పు మెరుపుల ద్వారా, ఉరుముల ద్వారా జరుగుతుంది.

✣ హైడ్రోజన్ "మిత్రుని" (ఒక విధమైన అగ్నిపూజకు సంబంధించిన కర్మకాండకు అధిపతి) ద్వారా నియంత్రణ చేయబడుతుంది.

-- బ్రహ్మాండతలములో మిత్రుడు రసాయన శాస్త్రములోని అన్ని మాత్రలకు (MEASURES) ఉద్భవస్థానం.

- "వశిష్ఠుడు" అనబడే ఒక పవిత్ర అగ్ని దేవత కిరణము, సప్తఋషి మండలం లోని ఒక సూర్యుని ద్వారా హైడ్రోజన్ పరమాణువుల పరిణామాన్ని నియం త్రణ చేస్తుంది.
- యురేనస్ ద్వారా కేంద్రీకృతమయ్యే వరుణుని కిరణములు భూమి మీద ప్రాణతత్వాన్ని నియంత్రణ చేస్తాయి.
- ఆక్సిజన్ ప్రాణమునకు వాహకముగా పనిచేస్తుంది.
- వరుణుడు దహనము, విస్తరణ (EX-PANSION), వికిరణము (RADIA-TION) లకు అధిపతి.

-- భూమి మీద రేడియో ధార్మికత ఇతని అధీనంలోనే ఉన్నది.

- నీటిలోని గుప్తముగా ఉన్న వేడి (బడ బాగ్ని) ఫలదీకరణముకు ఉపయోగ పడుతుంది.
- ఖనిజ పరమాణువులు వృక్షజాతికి ఈ రాశి ద్వారా మార్చబడతాయి.
- దిగువ మానసిక కక్ష్య, ఆస్ట్రల్ తలాన్ని ఇది పరిపాలిస్తుంది. చేతనత్వము అనా హత చక్రం ద్వారా స్పందిస్తుంది.
- తల్లికి - బిడ్డకి మధ్య ఉన్న UMBILI-CAL CORD సంబంధాన్ని ఇది తెలుపు తుంది.
- కర్కాటక రాశి మనిషి పదార్థ జగత్తు లోకి "పడుటను" తెలుపుతుంది.

-- మకరము మనిషి యొక్క "ఉత్తాన ము" తెలుపుతుంది.

అందుకనే వేదపురాణాల సాంకేతిక నిరూపణలో సర్పముల జన్మస్థానము కర్కా టకమని, వరుణుని నివాసస్థానమని తెలుప బడింది. మకరము EAGLE యొక్క జన్మ స్థానమని చెప్పబడింది. సర్పములు దిగువ తలాలకి చేరుకుంటాయి. (వాకాలము, తులా-సూర్యుని నీచస్థానము).

- EAGLE ఉత్తరాయణంలో పైకి లెగు స్తున్న సూర్యుని సంకేతము.

-- అక్కడ MERIDIAN దాటుతున్నప్పుడు మేషము ద్వారా వృషభ, మీన రాశు లను కలుపుతాడు.

- కశ్యపు (మకర-కర్కాటకముల మధ్య నున్న ARCH) నికి ఇద్దరు భార్యలు.

-- అదితి (సంవత్సర తూర్పు),
దితి (సంవత్సర పడమర).

రాశిపరంగా వీటిని వినత (EAGLE తల్లి), కద్రువ (సర్పముల తల్లి) అంటారు.

పురాణకథలో గరుత్మంతుడు అమృ తం తెచ్చి తన తల్లి వినతను కద్రువ బంధం నుంచి విడిపించుట ఒక బ్రహ్మాండమైన చక్రీయ గమనాన్ని తెలుపుతుంది.

- మేషం మొదటి డిగ్రీ నుంచి, కర్కాటక రాశి చివరి డిగ్రీ వరకు రాశి చక్రపు 3 వ వంతు పూర్తవుతుంది.
- ప్రతీ త్రిభుజము అగ్నితత్వంతో మొద లుపెట్టి జలతత్వముతో ముగుస్తుంది.
-- ఈ మూడు బిందువులు వేదములలో త్రైవిద్య అని తెలుపబడింది.
-- అందువల్ల ఈ మూడు జలతత్వ రాశులు పదార్థముల అవసాన దశను తెలుపుతాయి.
- ముదురు ఆకుపచ్చ రంగు భౌతికవాది (MATERIALIST) మనిషిని ఈ రాశిలో చూపిస్తుంది.
-- ఆకుపచ్చ రంగు శని గ్రహపు రంగు.
-- మకరరాశి ప్రతిబింబము (REFLEC-TION) గా కర్కాటక రాశి ఈ రంగును గ్రహిస్తుంది.
- సాధకుడు ఈ రంగుని ధనస్సురాశికి చెందిన GOLDEN YELLOW (సువర్ణ ము) రంగుతో తటస్థీకరించాలి.

ఈ విధంగా సాధకుడు ప్రాణమయ, మనోమయ తలాలలో ఉన్న ఇది వరకటి అవరోధము కలిగించే సంస్కారాలను తొల గించుకొంటాడు.

- సువర్ణపు రంగు నుంచి తేనె రంగులోకి మారినప్పుడు BUDDHIC (విజ్ఞాన మయ) తలంలో సాధకుడు సాత్విక మైన పూర్తి అధికారాన్ని సంపాదిస్తాడు.
- తరువాత చరణంలో నీలి రంగును ఈ రాశిలో ఆకర్షించుకుంటాడు.
-- వృషభము యొక్క సౌందర్య - చేతనత్వము (BEAUTY CONSCIOU SNESS) సాధకుని ప్రేమ ప్రకృతి యొక్క లోపాలను సరిచేస్తుంది.
- చివరిగా ఆనందమయ తలములో (SOUL - LEVEL) గులాబి రంగు ద్వారా హృదయ చక్రము నుంచి సాధకుని చేతనత్వము విప్పారుతుంది.
- ఆవర్తన (PERIODICITY), లయ (RHYTHM), సంగీతము కర్కాటక రాశి ప్రభావానికి లోనవుతాయి.
- స్వరము వృషభము ద్వారా,
-- సంగీతము కర్కాటక రాశి ద్వారా పరి పాలింపబడతాయి.
- మానసిక, విజ్ఞానమయ తలాలతో సం బంధం లేకుండా ప్రాణమయ తలం నుంచి ఆనందమయ తలానికి సాధ కుని చేతనత్వాన్ని తీసికెళ్ళే శక్తి సంగీతా నికి ఉంది. (గాయంతం త్రాయతి).
- ☝ కానీ సామర్థ్యము గల గురువు లేకపోతే సంగీతం ద్వారా పయనించే సాధకుడు మతిభ్రమణకులోనై ఇతర సూక్ష్మతలా

లలో ఉండే స్వార్థ పూరిత ప్రేతము లకు వశీభూతుడై,

-- పాత ఋణాత్మక సంస్కారాలకు లోనై తాంత్రిక మార్గాలలో అధోలోకాలకు వెళ్ళే ప్రమాదముంది.

✥ నారదుడు, త్యాగరాజు, జయదేవుడు ఈ మార్గము ద్వారా సాధన చేసిన వ్యక్తులు.

✥ మిధునరాశిలో నారదుడు సందేశవాహ కుడు.

-- కర్కాటకరాశిలో సంగీతజ్ఞుడు.

✥ మన సౌరమండలములో నారదుని మించిన గురువులేడు.

-- శంభాలావాసులకు కూడా అతి - బ్రహ్మాండ (SUPRA COSMIC) తల ములో మార్గదర్శకుడు ఈయనే.

-- ఇతనికంటే పరిపూర్ణతలో సమాన స్థాయి కలిగిన వ్యక్తి సనత్కుమారుడు ఒక్కడే.

✥ చంద్ర-బృహస్పతులు కర్కాటకరాశి లో, సూర్యుడు మేషరాశిలో, కుజుడు మకరరాశిలో, శని తులారాశిలో, శుక్రుడు మీనరాశిలో ఉన్న సంపూర్ణ తరంగాల లయబద్ధత మీద ధ్యానము "రామ" అనే మంత్ర సంగీతము తెలు పుతుంది.

-- ఇదియే నారదుడు వాల్మీకికి ఇచ్చిన రామమంత్రము.

✥ ఈ రాశి సంఖ్య 2.

## 5. సింహము (LEO) ♌

☆ సింహరాశి స్వరూపము లేక సంకేత ము DIAPHRAGM, ప్రక్కటెముకల క్రిందన చూడవచ్చు.

-- అనాహత చక్రము, సూర్య చక్రముకు మధ్య సంతులన ఈ సంకేతము తెలి యజేస్తుంది.

☆ DIAPHRAGM యొక్క ఊర్ధ్వ సంతు లన కామము, ఆహారపు అలవాట్ల అనియంత్రణ వల్ల దిగువ కేంద్రము లకు లాగబడి వ్యక్తి యొక్క మనస్సు, ప్రాణము మీద చేతనత్వము యొక్క పట్టు సడలుతుంది.

-- జీవితము అనుభవము లేక జీవించ టము ఒక నిరంతర సంఘర్షణగా రూపొందుతుంది.

☆ యమ, నియమ, ఆసనాల సాధన వల్ల, మనస్సు ఉచ్ఛ్వాస, నిశ్వాసల స్పందనము మీద కేంద్రీకరించుట వలన, సింహరాశి క్రియాశీలత సాధన చేసే వారిలో చేతనత్వమును ఉచ్ఛ స్థాయికి తీసుకుని వెళుతుంది.

★ సాధన మొదటి స్థాయిలలో సింహరాశి సంకేతము వేద పురాణాల్లో "కుక్క".

-- ఉచ్ఛ క్రియాశీలత సింహము ద్వారా చూపబడినది.

★ DOG-STAR (SIRIUS) సింహరాశితో రహస్యాత్మక సంబంధం కలిగివున్నది.

★ పృథ్వి మీద ఉన్న కుక్కలు DOG STAR ప్రకంపనను కలిగి ఉంటాయి.

-- కుక్కల ఉనికి సాధకుని చేతనత్వము ను ఉచ్ఛస్థాయికి తీసుకుని వెళ్ళటానికి ఉపయోగపడుతుంది.

-- ఒకానొక స్థాయిలో సాధకుడు కుక్క లను ఆకర్షిస్తాడు.

దత్తాత్రేయుడు తన చుట్టూ ఉన్న 4 కుక్కలను తన భక్తులను, శిష్యులను ఉద్ధ రించటానికి ఉపయోగిస్తాడు.

★ అనాహత చక్రము సింహరాశికి ప్రేమ సందేశాన్ని ఇస్తుంది.

★ సంఘీభావము సింహరాశి వల్ల కలు గుతుంది.

★ మిధునరాశి NUMERICAL PO-TENCY సింహరాశితో SEXTILE (60 డిగ్రీలు) LINK స్థాపించబడినప్పుడు మనిషికి తన 5 చేతి వేళ్ళ మీద పట్టు దొరుకుతుంది. ఇది కలియుగములో ఇంత వరకు చెప్పబడలేదు.

-- ఈ పట్టు సాధకుని 5 ఇంద్రియాలను అనాహత చక్రం మీదకు తీసుకెళ్తుంది.

★ చేతికి పట్టు దొరకుట అనే సామర్థ్యం మస్తిష్కములోని అంగుష్ఠ కేంద్రము, సూర్య, హృదయ కేంద్రముల మధ్య అమర్చబడియున్న గుప్త చక్రము వల్ల సాధ్యమవుతుంది.

☝ తోటి మానవుల కష్టములన్నిటిని తీర్చి వేయాలి అనే కోరిక ఆచరణలో పెట్టిన పుడు ఈ చక్ర జాగరణ జరుగుతుంది.

☝ ఇతరులకు చేయి అందించినప్పుడు తప్ప గురువు శిష్యునకు చేయి అం దించడు.

★ రోగనివారణ ఈ రాశికి చెందుతుంది.

★ GOLDEN YELLOW ఈ రాశి రంగు.

★ ఈ రాశి సంఖ్య 1 లేక 5.

★ గోధుమలు, తేనె సింహరాశి ప్రభావ ము లోనికి వస్తాయి.

★ రాబోయే యుగపు ఆహారము, కర్కా టక రాశి యొక్క పాలు, వెన్న, నెయ్యి, సింహరాశి యొక్క తేనె, గోధుమలు.

నరశింహావతారపు కాలంలో సింహం యొక్క 5 నఖములుతో పొట్టను చీల్చుట, 5 వేళ్ళు, హృదయము, DIAPHRAGM యొక్క పట్టును చూపిస్తుంది.

## 6. కన్య (VIRGO) ♍

✡ ఇది రెండవ ద్విస్వభావ రాశి. రెండవ పృథ్వీతత్వ రాశి.

✡ మహాపరానిర్వాణిక తలాన్ని ఊహించ గలిగితే ఈ రాశిలో ఉన్న జగన్మాత స్వరూపాన్ని అర్థము చేసుకోగలము.

-- రామానుజాచార్య, JESUS CHRIST చెప్పే అనుగ్రహము లేక GRACE ఈ రాశిలో పనిచేస్తుంది.

☝ అంటే సాధకుని ప్రయత్నముకాక, జగన్మాత ప్రేమమయ దృష్టి శిష్యుడ్ని ఉద్ధరిస్తుంది.

✡ విశ్వగురువుల ఉత్పత్తి రాశి యిదే.

✡ ఈ రాశి రోగుల సేవకి కారణము అవుతుంది.

✡ ఈ రాశి రంగు "VIBGYOR"

✡ అనసూయ అనే నక్షత్రం సప్తఋషి మండలంలోని అత్రి మహర్షి భార్యగా పేర్కొనబడినది. దీని కిరణముల ప్రభావం చంద్రుని కిరణముల ద్వారా ఈ రాశి మీద పడుతుంది.

☝ కేవలము ఇద్దరు వ్యక్తులు మాత్రమే ప్రస్తుతము పృథ్వి మీద ఈ కిరణము లకు స్పందించగలరు.

-- వీరు మైత్రేయుడు, దత్తాత్రేయుడు.

✡ ఈ రాశి యొక్క ఆహారము చెఱకు.

-- అనుగ్రహము వర్షించే తల్లి లలిత చేతి లో చెఱకుగడ ఉంటుంది.

✡ ఈ రాశి సంఖ్య 7.

✡ ఈ రాశికి ఏ చక్రము ఇవ్వబడలేదు (మీన రాశికి కూడ).

-- అనుగ్రహపాత్రులయిన తల్లిపుత్రులు ఆజ్ఞా, సహస్రార మధ్యమున ఏర్పడే కొత్త చక్రము ద్వారా పనిచేస్తారు.

-- దీనినే ఇంద్రుని జన్మస్థలం అంటారు.

-- ఈ చక్రము మీద కన్య, వృషభము, మీనరాశుల సమ్మిళిత క్రియాశీలత పనిచేస్తుంది.

## 7. తుల (LIBRA) ♎

❀ ఇది మూడవ చరరాశి. రెండవ వాయు తత్వ రాశి. ఎటు వైపు నుంచి లెక్క పెట్టినా రాశి చక్రములో ఇది సత్యమే.

❀ తులారాశి తత్వము వల్ల బిందువులో కేంద్రీకృతమైన సృష్టి గ్రహ గోళముగా రూపొందుతుంది.

❀ మేషరాశి వలె ఈ రాశి 12 రాశుల స్వభా వాల మిశ్రమము.

❀ తులలోని 2 భుజములు సంతులన కావటమంటే రెండు విపరీత బలాలు కేంద్రీకృతమగుట.

❀ నిజానికి తుల 12 రాశులను 6 జంటలుగా వ్యవస్థీకరిస్తుంది.

రెండు విషువములను (VERNAL EQUINOX - MARCH 20 - 0° ♈, AUTUMN EQUINOX - SEP. 23 - 0°. LIBRA ♎) కలిపే పృథ్వీకేంద్రము నుంచి వెళ్ళే రేఖ బ్రహ్మరంధ్రము గుండా వెళ్ళే 6 జంటల రాశులు 6 చక్రములుగా అమరి ఉన్నాయి.

❀ షట్చక్ర జాగరణతో మొదలయ్యే సాధకుని యాత్ర అంతఃకరణ శరీరములో ఉన్న షట్చక్రాల గుర్తింపుతో అంతమవుతుంది.

మిథునము వలె తులారాశి మనిషి LATERAL SENSE మనస్సు యొక్క సంతులనతో అంతమవుతుంది.

❀ సమాన వాయువు (ప్రాణమయ కోశం యొక్క సంతులీకరణశక్తి) సుషుమ్న ద్వారా 3 కేంద్రాలలో పనిచేస్తుంది.

-- ఆజ్ఞాచక్రము మనస్సుని, హృదయకేంద్రము భావములను, మణిపూరక చక్రము మనిషి భౌతిక సంతులనను పరిపాలిస్తాయి.

-- ఈ మూడు క్రియాకలాపాలు కలిపి సమాన వాయువు అవుతుంది.

ఉచ్ఛ్వాస ప్రాణవాయువు, నిశ్వాస అపాన వాయువు యొక్క భౌతిక స్వరూపాలు.

-- వీటి మధ్య సంతులనము వల్ల దిగువ చక్రాలు పై చక్రాలలో లీనమౌతాయి.

క్రొత్తగా ఏర్పడిన షట్చక్రములను పద్మములు అంటారు.

❀ షట్ పద్మముల వికాసము షట్ చక్రముల తరువాత జరుగుతుంది అన్న రహస్యము తెలుసుకోవాలి.

బుద్ధుని అత్యుత్తమ రూపము, పద్మములో కూర్చున్న మనిషి.

❀ మేషము నుంచి తుల వరకు తిరిగే రాశి చక్రభ్రమణాన్ని "TREE OF LIFE" అంటారు.

ఇక్కడ నుంచి, అనగా 2 వ ధృవం నుంచి సాధకుడు తులారాశిలో ప్రతిష్ఠితం అవుతాడు. అందువల్లనే "TREE OF LIFE" ఇతనికి తల్లక్రిందులుగా ఉంటుంది. (గీత - 15వ అధ్యాయము).

❀ సాధారణ మానవులకు తులారాశి నుంచి వృశ్చికరాశి వైపు ప్రయాణము జరుగుతుంది.

-- రాజయోగ సాధకునకు తులారాశి నుంచి కన్యారాశి వైపు ప్రయాణము జరుగుతుంది.

❀ మిథునరాశి మేష, తులల మధ్యన ఉన్నది.

❀ దీనికి ఎదురుగా ఉన్న ధనస్సు రాశి రక్షకుడు "అశ్వారూఢుడైన వ్యక్తి"గా మనిషితో కలసి భూమి మీద నడుస్తాడు.

-- "వ"కారము ఈ రాశిలోనే ఉన్నది.

❀ ఈ రాశి సంఖ్య 4.

-- 2 + 2 = 2 X 2 అనే 4 వ సంఖ్య యొక్క సక్రియతను ఈ రాశి తెలుపుతుంది. ఇంక ఏ సంఖ్యకి ఈ విధమైన సంబంధము లేదు.

❀ సాధారణ వ్యక్తులకు ఈ రాశి CRIMSON ఎరుపుతో మణిపూర చక్రంలో పనిచేస్తుంది. కానీ సహస్రదళ పద్మంలో కూర్చున్న శిష్యునకు తెలుపు - నీలి రంగు మిశ్రమముగా ఉంటుంది.

నిజానికి ఈ స్థాయిలో సాధకునకు నీలము, తెలుపుల మధ్య తేడా ఉండదు.

❀ ఈ రాశి సంకేతము ♎.

-- ఇది ముండకోపనిషత్తు లోని "ద్వా సుపర్ణా" అనే ధ్యానానికి సంకేతము.

❀ అయస్కాంత ఇనుము ఈ రాశి లోహము.

-- ఇనుము రాశి చక్రములోని సాధకుని జీవితము తెలుపుతుంది.

-- అయస్కాంతము పద్మములలో సాధకుని జీవితము తెలుపుతుంది.

❀ వ్యక్తిలోని సుషుమ్న పుట్టినప్పుడు ఇనుము.

-- అయస్కాంతము ద్విజత్వప్రాప్తిని తెలుపుతుంది.

## 8. వృశ్చికము (SCORPION) ♏

✳ ఇది మూడవ స్థిరరాశి.
రెండవ జలతత్వరాశి.

రహస్య స్థలాలు దీని ముఖ్య సంకేతము.

నహుషుడు 100 యజ్ఞములు చేసి ఇంద్రుడయ్యెను. ఇంద్రుని భార్యను కోరి అగస్త్యుని శబ్దము వల్ల సర్పమయి దిగువ తలానికి వచ్చెను.

✳ వృశ్చికరాశి ఆత్మ చేతనత్వపు లేమిని తెలుపుతుంది.

✳ భౌతికజగత్తులోకి ఆత్మ అవతరణ సర్పిలాకారములో దిగుతుంది.

-- డేగ, సర్పము యొక్క శత్రువు ఈ రాశిలోనే స్థితమయివున్నది.

✳ వృశ్చికము నుండి వృషభము వైపు ఊర్ధ్వ ముఖముగా ఆత్మ నిర్మాణ సాధన జరుగుతుంది.

✳ సర్పము గరుడునితో ఓడింపబడుతుంది. (శ్రీకృష్ణుని వృషభరాశిలోని లగ్నము కాళీయమర్దనాన్ని తెలుపుతుంది).

❋ పరిణామక్రమము యొక్క మొత్తము రహస్యము, భౌతికతలములో పాతి వేయబడ్డ వ్యక్తి యొక్క పెరుగుదలను తల్లి గర్భంలోని పిండం తెలుపుతుంది.

❋ ఆధ్యాత్మిక మృత్యువు, భౌతికజగత్తులోని జన్మ కర్కాటకరాశి తెలిపితే,

-- భౌతిక మృత్యువు లేక ఆధ్యాత్మిక జన్మ మకరరాశి ద్వారా జరుగుతుంది.

ఆత్మ సత్యము గలది (SATYAVAN). సావిత్రి (సూర్యుని వెలుగు)తో పరిణయము జరిగిన సంవత్సరములో సత్యవంతుడు మరణిస్తాడు అని భవిష్యత్‌వాణి ఉన్నది. పెళ్ళి అయిన తరువాత సూర్యాస్తమయ సమయములో మరణిస్తాడు.

PLUTO గ్రహము ద్వారా కేంద్రితమైన కిరణాలు - యముడు సత్యవంతుడిని చీకటి ప్రపంచములోకి తీసుకుని వెళతాడు.

సత్యవంతుడు తన సత్యమైన చేతనత్వమును కోల్పోతాడు. అతని భార్య అయిన ఆధ్యాత్మిక వెలుగు అతనితోనే ఉండి, రెండవరోజు ఉషోదయ మప్పుడు సత్యవంతుని పునరుజ్జీవుడ్ని చేస్తుంది.

❋ వృశ్చికరాశి వైరాగ్యాన్ని కూడ పరిపాలిస్తుంది.

❋ పుష్పము పుష్పించుట, పుష్పం నుంచి ఫలము, ఫలము నుంచి విత్తనము, విత్తనము నుంచి తిరిగి మొలకెత్తుట అనే కంటికి కనిపించని రహస్యము వృశ్చికరాశి.

❋ సర్పయాగము వీటిని ఊర్ధ్వముఖ సాధనలో ఉపయోగించుట తెలుపుతుంది.

ఈ యాగం వల్ల నాగజాతి అనంతుడుగాను, సర్పజాతి వాసుకిగా మారుతుంది.

❋ వ్యక్తిలోకి కుండలినీ సర్పము మణిపూరక యజ్ఞములో ఆహుతి అయి, ఆశీర్వాద రూపంలో విశుద్ధ చక్రము నుంచి బహిర్గతమవుతుంది.

చంద్రవంశపు రాజు తక్షకుడిని చంపుటకు ఈ యాగము తలపెట్టెను (తక్షక : ఆకాశములో కన్నములు త్రవ్వేవాడు). కాని ఇంద్ర సింహాసనాన్ని చుట్టుకున్న తక్షకుడు చంపబడడు. (ఇంద్ర : PENIAL - PITUITARY మధ్య ఉన్న రిక్తస్థానము - సాధకుని వల్ల నింపబడుతుంది).

అంటే మానవుని కామబీజము సృజనాత్మక తలాలను అందుకుంటుంది.

❋ వృశ్చికరాశి సంఖ్య 8.

❋ ఏడు తలాలను దాటిన తరవాత, అధోఃగామి అయిన వ్యక్తి భౌతిక తలములో బద్ధుడవుతాడు.

-- ఊర్ధ్వగామి అయిన సాధకుడు ఏడు

తలాలను దాటి 8 వ తలము అయిన SUPRA COSMIC తలమును చేరు కుంటాడు.

❋ దిగువ తలాల వైపు మానవుని జన్మను వృశ్చికరాశి చూపిస్తుంది.

-- అదే వృషభరాశి వైపు ఊర్ధ్వగామి అయినప్పుడు శ్రీకృష్ణుడు ఎనిమిదవ సంతానముగా జన్మిస్తాడు.

❋ సిద్ధాసనములో కూర్చుని సాధకుడు "VERTICAL LEVELS" లో తన EQUITATOR EQUAL చేసుకున్నప్పుడు సుషుమ్నకు దిగువ భాగములో ఒక స్పందన అనుభవిస్తాడు.

-- ఈ స్పందన సిద్ధాసనములోని కుడి మడమ స్థితి వల్ల వస్తుంది.

-- ఇది బ్రహ్మ రంధ్రములో "ELECTRIC HINT" ఇస్తుంది.

-- ఇప్పుడు కళ్ళు మూసుకొని ఆజ్ఞా చక్రం మీద ధ్యానం చేస్తూ మనస్సును బ్రహ్మ రంధ్ర పైభాగములో పెట్టినప్పుడు సాధకునకు PITUITARY BODY నుండి స్పందన వస్తుంది - "PITUITARY HINT".

-- ఇది కుండలినీ ఏ విధమైన ప్రమాదం లేకుండా సుషుమ్న గుండా ప్రవహిస్తుంది అని తెలుపుతుంది.

## 9. ధనస్సు ( SAGITTARIUS) ♐

❋ వ్యక్తులలో ఇది "TENSION".

-- సాధకులలో లక్ష్యభేదనములు చేసే బాణములుగా ధ్యానింపబడుతుంది.

❋ పంచీకరణం చెందిన వ్యక్తి మానవుడు.

-- అతని రథము 5 తత్వములతో, 5 మహాభూతములతో రక్షింపబడుతోంది.

-- అతనిలోని ఐదుగురు ప్రజ్ఞాపుత్రులలో మధ్యనున్న వ్యక్తి మనోమయకోశము.

-- ఇతనే నరుడు.
నారాయణుని శిష్యుడు.

❋ 9 వ రాశి అయిన ధనస్సు వరకు దిగిన సాధకుడు అటు నుంచి ఊర్ధ్వ గమనము మొదలెడతాడు.

❋ మహాభారతం యొక్క పర్వములు 18.

-- భగవంతుడు తన శిష్యునికి చెప్పిన జ్ఞానము 18 అధ్యాయములు.

-- యుద్ధంలో పాలు పంచుకున్న 18 అక్షౌహిణులు 18 రోజుల పాటు యుద్ధం చేస్తాయి.

-- చివరికి '10 మంది వ్యక్తులు' మాత్రమే జీవిస్తారు.

❋ ఎప్పుడూ కదులుతూ ఉన్న లక్ష్యాన్ని చూసి దాని ప్రతిబింబము చూస్తూ పైనున్న లక్ష్యాన్ని భేదనము చేయాలి.

-- హృదయములో ఉన్న పంచకోణ నక్ష త్రం లోకి 5 ఇంద్రియాలను ఇముడ్చు కొని 5 బాణాలుగా ఉపయోగించాలి.

-- ఐదుగురు సహోదరులు (యజ్ఞ కుండ ములోంచి పుట్టిన) ఒకే కన్యని పెళ్ళి చేసుకుంటారు.

❋ లక్ష్యము PENIAL GLAND, PITUITARY BODY మధ్య ఉన్నది.

-- దాని ప్రతిబింబము సాధకుని కాలి వద్ద ఉన్నది. (మీనరాశి).

-- యజ్ఞవేదికలో జన్మించిన కన్య (కన్యా రాశి) మీనరాశికి ఎదురుగా ఉన్నది.

❋ ఈ వివాహము వల్ల సాధకునిలో "ఇంద్రుని నివాసస్థలం" (ఇంద్రప్రస్థ) నిర్మాణము జరుగుతుంది.

-- అక్కడ నుంచి అతని జీవితము భగ వంతునికి సమర్పిత జీవితము.

తన సహోదరుల బాధ్యత అంతా తీసుకోవటము, మహాదేవుని చూసి దివ్యా స్త్రములు పొందటము, ఇంద్రుని రాజ్యము జేరుట, ఊర్వశి పెట్టిన పరీక్షలో నెగ్గుట, ఇదంతా తన కోసము గాక, తను, సహో దరులు యుద్ధములో పాలు పంచుకొనుట అనే బృహత్తర దీక్షా ప్రణాళిక ఈ రాశి.

❋ సాధన లయయోగము.

-- సాధకుడు సిద్ధాసనములో కూర్చుని కన్నులు మూసుకొని, నోరు మూసు కుని పవిత్ర శబ్దమును దీర్ఘముగా ఉచ్చరిస్తాడు.

-- తన మనస్సుని స్వరముతో కలిపి ఉత్పత్తి స్థానమును గుర్తించటానికి ప్రయత్నిస్తాడు.

దీని వల్ల కుండలిని విశుద్ధి చక్రము వరకు లేస్తుంది.

❋ ఉత్పత్తి స్థానమును హృదయము దిగువ భాగములో గుర్తిస్తాడు.

-- ఆ కేంద్రము వద్ద లేత ఆకుపచ్చని పృష్ఠ భూమి మీద కాషాయరంగుని ఆరోపణ చేసి ధ్యానము చేస్తాడు.

-- ఉచ్చారణ ఆపి పవిత్ర శబ్దమును మానసికంగా జపిస్తాడు.

కుండలిని సహస్రారము చేరుకుంటుంది.

❋ అప్పుడు గురువు అతని బదులు సమాధిలో ఉచ్చారణ చేస్తాడు.

-- శిష్యుడు SUPRA COSMIC తలానికి ఎదుగుటకు సిద్ధమవుతాడు.

ధనస్సులో ఉన్న EAGLE నక్షత్రము (AQUILLA) రామాయణంలోని సంపాతి జటాయువు సహోదరుడే.

❋ ధనస్సు గరుత్మంతుని తోక. మిధునము ముఖము.

ఉదాంకుడనే శిష్యుడు గురు పత్ని కొరకు పౌష్యుడనే రాజు నుంచి తన గురు పత్నికి EAR RINGS తీసుకొని వస్తూ తక్షకుని మాయలో పోగొట్టుకుంటాడు. నాగలోకానికి వెళ్ళి అక్కడ ఇద్దరు స్త్రీలు నలుపు, తెలుపు దారాలతో బట్టలు అల్లుట చూస్తాడు.

12 అరలుగల చక్రమును ఆరుగురు కుమారులు త్రిప్పుట చూస్తాడు.

అక్కడ ఇంద్రుని సహాయముతో సర్ప ములను గెలుస్తాడు. తక్షకుడు EAR RINGS ని తిరిగి యిచ్చివేస్తాడు.

- ఈ రాశి సంఖ్య 3.
- ఈ రాశి లోహము TIN.

## 10. మకరము (CAPRICORN) ♑

- ఇది నాల్గవ చరరాశి.
  మూడవ పృథ్వీ తత్వరాశి.
- మకరము రాత్రి యొక్క చలి నుంచి, నిద్ర నుంచి మేల్కొలిపే సూర్య కిర ణాల ఉత్పత్తి స్థానము.
- ఉషోదయము అనేక రహస్యాలను తనలో దాచుకుంది. అప్పటి సూర్యు డు ఆధ్యాత్మిక, భౌతికమైన 2 ధృవాల కిరణాలను విడుదల చేస్తాడు.
- హృదయ పద్మములో ఉన్న దేవత నారాయణుడు (నీటి మార్గము).

-- హృదయ చక్రములో ఉన్న వ్యక్తి వాసుదేవుడు (12 అక్షరములు పేరు గల దేవుడుగా తనని ఆహుతి చేసుకొని రాశి చక్రముగా మారతాడు).

- మకర అనగా 5 వ్రేళ్ళు విప్పారిన చేయి.
- నరమేధము ఈ రాశి కర్మకాండ. పురుషసూక్తంలో దీని వివరణవున్నది.
- మకర, కర్కాటక రాశులు ప్రపంచము ల సూర్యోదయము, సూర్యాస్తమయా లను తెలుపుతాయి.
- కర్కాటక రాశి వరుణుని నివాసస్థలం. మకరరాశి అతని వాహనము.

వరుణుడు భృగువు యొక్క తండ్రి. 5 సార్లు భృగువు అడిగిన ప్రశ్నకు తపస్సు చేసి నీ జన్మస్థానమును తెలుసుకో అని చెప్తాడు.

- మకరము-అభయ ముద్ర సంకేతము.
- మకరము నుంచి కర్కాటక రాశి వరకు ఉండే 6 రాశులను మకర తోరణం అంటారు (DIVINE ARCH).
- మృత్యువు అధిపతి అయిన శని ఈ రాశి అధిపతి.
- శని, చంద్రులు ఒకే అనుభూతిని 2 విభిన్న కాలమానములో తెలుపుతారు.

-- చంద్రుడు $2^1/2$ రోజులలో ఒక రాశిలో ప్రయాణిస్తే, శని $2^1/2$ సంవత్సరాలు తీసుకుంటాడు.

✳ చంద్రుడు భౌతిక జన్మకు లేక ఆధ్యాత్మిక మృత్యువుకు కారకుడు.

-- శని భౌతిక మృత్యువుకు, ఆధ్యాత్మిక జన్మకు కారకుడు.

✳ కర్కాటక రాశి దక్షిణాయనమును పరిపాలిస్తే, మకరరాశి ఉత్తరాయనాన్ని పరిపాలిస్తుంది.

✳ వంగపండు రంగు ఈ రాశి రంగు.

✳ ఈ రాశి సంఖ్య 10.

పురుషసూక్తములో "HE STOOD FORTH BY TEN DIGITS" అని ఉంది.

✳ బ్రాహ్మీమూలిక ఈ రాశి మొక్క.

✳ ఒక కల్పములో పదార్థమును ఆత్మగా మార్చే పని ఉత్తరాయనముది. దీనినే వరాహ అవతారము అంటారు.

## 11. కుంభం (AQUARIUS) ♒

✪ నాల్గవ స్థిరరాశి.
మూడవ వాయుతత్వ రాశి.

✪ కుంభము వాక్కు యొక్క పరాస్థితిని తెలుపుతుంది.

-- అక్కడ వాక్కే ఈశ్వరుడు.

✪ AQUARIUS సంకేతము "IS AND IS NOT".

-- అతి బ్రహ్మాండ తలము నుంచి వచ్చే రెండు అసమాన ప్రతిభగల శక్తిధారలను ఇది తెలుపుతుంది.

✪ SUPRA COSMIC PLANE లో ఉండే వశిష్టుడు, COSMIC PLANE లో ఉండే అగస్త్యుడు ఈ తలములో నివసించే వ్యక్తులను పరిపాలిస్తారు.

✪ మిత్రా - వరుణులు SUPRA COSMIC PLANE నుండి రెక్కలు ఉన్న జంట గుర్రాలుగా దిగుతారు (అశ్వనీ దేవతలు).

-- సూర్యతలంలోకి దిగినప్పుడు 2 సుపర్ణ పక్షుల వలె దిగుతారు (ముండకోపనిషత్తు).

✪ శబ్దము ఆకాశాన్ని సృష్టిస్తుంది.
వెలుగు కాలాన్ని సృష్టిస్తుంది.

✪ ఈ రాశి ప్రభావము వల్ల వ్యక్తి RADIO ACTIVE అవుతాడు.

-- అన్ని తలాలలోని ప్రగతి తీవ్రతరమవుతుంది.

-- దేవతలు వెలుగులోకి వస్తారు.

-- దీక్షలు సామూహికంగా ఇవ్వబడ్డాయి.

-- ఒకే రాజ్యం, ఒకే పాలన అనే సూత్రం తీసుకు రాబడుతుంది.

-- నారదుడు ఒక నక్షత్రముగా ఏర్పడి సనత్కుమారునకు శిష్యులను తయారుచేయుటలో సహాయం చేస్తాడు.

- భారతరాశి మకరం నుంచి కుంభానికి మారుతుంది.

ఇది జరిగే ముందు భారతీయ MORALITY అతి నీచస్థాయికి చేరుకుంటుంది.

-- నమ్మకము లేకపోవుట, నియమ పరిపాలన లేకపోవుట, విప్లవములు, DISORDER, BLOOD SHED ఈ రాశి మారబోయే ముందు సూచనలు.

- క్రొత్త యుగము రాబోయే ముందు మను పరిపాలనలో భారత, FRANCE రాజ్యముల ఆధ్యాత్మిక వివాహము జరుగుతుంది.

- వరుణుడు ఈ రాశి అధిపతి.

- ఏ ఆకారము, రంగు, సంఖ్య, ఆకృతి లేకుండా ధ్యానము చేయుట ఈ రాశి విధానము.

- CONSCIOUS MIND నిద్ర పోతున్నప్పుడు GROUP CONTACT దీక్షలు, TRAINING జరుగుతుంది.

-- కేవలము గురువును గురించి ఆలోచించినంత మాత్రముననే సంబంధం ఏర్పడుతుంది.

-- "CONSCIOUS EXISTANCE OF MAN IN ALL PLANES SIMULTANEOUSLY" వీరి యోగము.

- పూర్ణ కుంభము ఈ రాశి సంకేతము (పూర్ణమదః .......).

- ఈ స్థాయి చేతనత్వమునకు వర్ణము, శబ్దము ఒక్కటే.

-- అంతఃకరణ నిర్మాణము వల్ల మూడవ కన్ను తెరచుకుంటుంది.

- చిన్న స్థాయి లయములు వృశ్చికము ద్వారా నిర్ణయింపబడతాయి.

-- ప్రళయములు కుంభరాశి ద్వారా నిర్ణయింపబడతాయి.

- చిన్న స్థాయి పునః సృష్టి గుణ్ణము - మీద - వ్యక్తి వల్ల జరుగుతుంది.

-- పెద్ద స్థాయిలో పునః సృష్టి మత్స్యావతారము వల్ల జరుగుతుంది.

## 12. మీనము (PISCES) ♓

- ఇది ద్విస్వభావ రాశి.
  జలతత్వపు రాశులలో మూడవది.

- మీనరాశి భౌతిక శరీరంలో రెండు కాళ్ళని చూపిస్తుంది.

- 2 మత్స్యములు PENIAL GLAND, PITUITARY BODY లో ఉంటాయి. భూత, భవిష్యత్తులు విభిన్న దిశలలో పరుగులు తీసి వ్యక్తిలో కలుస్తాయి.

❀ ఇంద్ర జన్మస్థల నిర్మాణమే "FISHING" అనబడుతుంది (JESUS).

❀ మీనము మూడవ జలతత్వపురాశి.

ప్రతీ జలతత్వపురాశి "THE END OF THINGS".

❀ కర్కాటకము జీవితపు పరిసమాప్తి మృత్యువులో తెలుపుతుంది.

-- వృశ్చికము చేతనత్వపు పరిసమాప్తి లేక మానసిక మృత్యువును తెలుపుతుంది.

-- మీనము ఆధ్యాత్మిక చక్రీయ గమనపు అంతు తెలుపుతుంది.

❀ మహాభారతములోని సత్యవతి మీన రాశి సంకేతము.

మూడు రకముల జలములు - 1. వియత్ గంగా 2. మందాకిని 3. భోగవతి.

సింహరాశిలో ఉన్న భగీరధుడు తన పితరుల బూడిద మీద గంగను ప్రవహింప చేసి వారికి ఉత్తమ లోకాలు కలుగజేస్తాడు.

కుంభరాశిలో ఉన్న అగస్త్యుడు ఉత్తరాన ఉన్న సూర్యుడి "ASCENDING" కిరణములు ఉపయోగించి సముద్ర జలాలను త్రాగి వాటి దిశను ఊర్థ్వముఖము చేస్తాడు.

పైకి క్రిందకు వెళ్తున్న నీటిమార్గము ఒక పూర్తి నీటి చక్రీయ మార్గమును పూర్తి చేస్తుంది.

❀ (నారాయణ) భక్తి యోగము ఈ రాశి మార్గము.

❀ ఇంద్ర స్థలము నుంచి శక్తి ప్రసరణ ఈ రాశి వల్ల జరిగి శంభాలాకి మార్గం ఏర్పడుతుంది.

❀ ఈ రాశి సంఖ్య కూడ 7.

❀ "PHOTOGRAPHY PRINCIPLE" - PISCES యొక్క పరిపాలనా క్షేత్రము లోకి వస్తుంది.



# ముఖ్య సూచనలు - ఆకాంక్ష



- ♣ భారతీయ జ్యోతిర్విద్య, రామాయణ, మహాభారతాలు, పురాణాలు, వేదాలు,
- -- ప్రకృతి వశానువర్తి అయిన సాధకుడు అనేక సాధనా పద్ధతులను, దేశ, కాల, మనో స్థాయి ఆధారంగా అనుకూల మైన కర్మకాండలను, యజ్ఞ విధానా లను అనుసరిస్తూ,
- -- క్షర పురుషస్థాయి నుంచి అక్షర పురుష స్థాయికి ఎదిగి, పురుషోత్తముడుగా రూపొందటం తెలుపుతాయి.
- ♣ 9 గ్రహములు - 9 శక్తికేంద్రములు, ద్వాదశరాశులు (6 చక్రముల జంట) - (6 జంటల పద్మములు) సాధకుని స్థాయి బట్టి సాధనా పద్ధతులు నిర్ణ యింపబడతాయి.
- -- ఈ విధముగా 9 x 12 = 108 = 18 = 9 అనే సంఖ్యా శక్తి పరిమితులు నిర్ణ యింపబడతాయి.
- ♣ మహాభారతములోని 18 పర్వములు, భగవద్గీతలోని ఎనిమిది, తొమ్మిది, పది హేను అధ్యాయాలు, 4 వ అధ్యా యపు యజ్ఞ విధానాలు సాధనా జగత్తు లో తీవ్ర కృషి సలిపే వారికి చాలా అవసరమైన పనిముట్లు.
- ♣ దుర్గా సప్తశతిలోని 13 అధ్యాయాలలో సృష్టి ఆది నుంచి ఒక మన్వంతరపు ప్రభువు అయ్యే ఒక స్థాయి వరకు చేయవలసిన సాధనా విధులు వర్ణించ బడ్డాయి.

- ♣ పురాణాలు "భవిష్యత్తును, జరిగిన సంఘటనలుగా వర్ణించుట" అనేది సాధకులు గుర్తించి, వాటి రహస్యాన్ని భేదించుకోవాలి.
- ♣ కన్యా రాశి గురించి వివరిస్తున్నప్పుడు, 7 తలాలకి ఆవల ఉన్న SUPRA COSMIC CONSCIOUSNESS అనుగ్రహ వర్షం ద్వారా సాధకుని పురుషార్థ ప్రయత్నం లేకుండా ఉచ్ఛస్థితులకు ఎలా కొనిపోతుందో తెల్పబడింది.
- ☝ అతి త్వరలో మొదలవబోయే సూర్య సావర్ణిక మన్వంతరపు యుగశిల్పుల మైన మనమీ అవకాశాన్ని పూర్తిగా ఉపయోగించుకుంటామని ఆశిస్తున్నాను.

ఈ క్లుప్త విజ్ఞానాన్ని మీకు అందించటానికి నేను ఉపయోగించుకున్న పూజ్య గురుదేవుల పుస్తకములు, Master E.K. పుస్తకములు, జ్వాలాకూలుని పుస్తకములు, ALAN LEO పుస్తకములు అందించిన మహనీయులందరికి నా కృతజ్ఞతలు.

మీ
శ్రీరామకృష్ణ



# గ్రహముల భౌతిక వివరణ పట్టిక

| గ్రహము యొక్క పేరు | సూర్యుని నుంచి సగటు దూరము (మైళ్లలో) | వ్యాసము (మైళ్ళు) | సంవత్సర కాలము (రోజులలో) | దిన కాలము (గం. - ని.) | కక్ష్యలో పరిభ్రమణ కాలము (గంటకు/మైళ్ళు) | చంద్రులు |
|---|---|---|---|---|---|---|
| బుధుడు | 35,392,000 | 3,058 | 188 | 24 - 5 | 105,000 | 0 |
| శుక్రుడు | 66,134,000 | 7,510 | 225 | 12 - 21 | 77,050 | 0 |
| భూమి | 91,430,000 | 7,926 | $365^1/_4$ | 24 - 0 | 65,533 | 1 |
| కుజుడు | 139,311,000 | 4,363 | 687 | 24 - 37 | 53,090 | 2 |
| గురువు | 475,692,000 | 84,846 | 4,333 | 9 - 55 | 28,774 | 4 |
| శని | 872,137,000 | 70,136 | 10,759 | 10 - 29 | 21,221 | 9 |
| యురేనస్ | 1,753,869,000 | 33,247 | 30,687 | 9 - 30 | 14,963 | 4 |
| నెప్ట్యూన్ | 2,745,998,000 | 37,276 | 60,127 | - | 11,958 | 1 |
| సూర్యుడు | | 8,60,000 | | | | |




శ్రీమహాకాల చక్రవర్తి యంత్రము